శా. నాళీకాళిమృణాళికాకబళనా-నంద న్మరాళాంగనా
పాళుల్ వ్యోమతలంబునం బ్రతిఫలిం-పం బోలు నాఁ గా నభః
పాళీపాండుపయోదపఙ్క్తులు సరః-పాళిం బిసాళింపఁగాఁ
బోలు న్నాఁగ దివిన్ భువిన్ సితఘన-మ్ముల్ హంసలుం బాటిలెన్

టీ॥ నాళీ...పాళుల్, నాళీక=పద్మములయొక్క, ఆళి=పఙ్క్తియొక్క, మృణాళికా=తూండ్లయొక్క, కబళన=తినుటచేత, ఆనందత్=సంతోషించుచున్న, మరాళాంగనా=హంసస్త్రీలయొక్క, పాళుల్=పఙ్క్తులు. వ్యోమతలంబునన్=ఆకాశమందు, ప్రతిఫలింపఁబోలు నాఁగాన్=ప్రతిబింబించెనోయనునట్లుగాను, నభః...పఙ్క్తి, నభఃపాళీ=ఆకాశప్రదేశమందలి పాండు=తెల్లనైన, పయోదపఙ్క్తులు=మేఘపఙ్క్తులు, సరఃపాళిన్=మడుగులవరుసయందు, బిసాళింపఁగాఁబోలు న్నాఁగన్=వ్యాపించఁబోలు ననునట్లుగా, దివిన్=ఆకాశమందును, భువిన్=భూమియందును, సితఘనమ్ముల్=తెల్లమేఘములును, హంసలున్=అంచలును, పాటిలెన్=ఒప్పెను.

చ. కలశజసంగతిన్ ఘనులు-గాంచిరి శుద్ధత నీడ నింక మాఁ
కలరదు మించుటంచుఁ గర-కావళితోఁ మణిచాపరేఖతోఁ
నిలఁ డిగుచంచలాళియున-నింపగు జాజిసరాలు వ్రేలవ
త్రిఁబలలనాఘమత్తతిఁ బు-రింగొనుచుం గురుకావిరీవులన్॥

టీ॥ కలశజసంగతిన్=అగస్త్యునిస్నేహముచేత, [అనఁగా నగస్త్యోదయమగుటచేత] ఘనులు=మేఘములు [గొప్పవారనియును] శుద్ధతన్=నైర్మల్యమును గాంచిరి=పొందిరి, (ఇచట మహాదర్శము వివక్షితము) ఈడన్=ఇక్కడ, మించుట=అతిశయించుట, మాకున్=మాకు. అలరదు=ఒప్పదు, అంచున్=అనుచు, కరకావళితోన్=వడగండ్లవర్షముతోడను, మణిచాపరేఖతోన్=ఇంద్రధనస్సుయొక్క రేఖతోడను, ఇలన్=భూమియందు, డిగు=దిగినట్టి, చంచలాళియున్=మెరపుపఙ్క్తులోయనునట్టి, లలనాఘము=స్త్రీస

మూహము, ఆత్తరిన్=ఆశరత్కాలమందు, జాజిసరాలు = జాజిపూవుల దండలు, ప్రేలన్ = ప్రేలుచుండఁగా, గొను = ధరించిన, చంగురుకావిదీవులన్, చందురుకావి = సిందూరపురంగుగలబట్టలయొక్క, దీవులన్=శోభలచేత, పురిన్ = పట్టణమందు, వర్తిలున్ = సంచరించును.

మ. కతకంబొక్కటికుంభసంభవుఁడనం-గల్పించి కాదంబినీ।
శతకాడంబరపంకిలాభ్రజలధిన్-సాధుప్రసాదంబుఁగూ।
ర్చి తగెంగాలము భూమి నేకరణిమిం-చెం దేటలీస్యందినీ।
తతి నానేలస దేనదిన్నదిని లే-దాబింబదంభంబునన్॥

టీ॥ కాలము=సమయము. కుంభసంభవుఁడవన్=అగస్త్యునివలె(?) ... కట్టి, కతకంబు=చిల్లగింజ, ఒక్కటి=ఒకదానిని, కల్పించి=కూర్చి, కాదం...జలధిన్. కాదంబినీ=మేఘపఙ్క్తులయొక్క, శతక=వందలయొక్క, ఆడంబర=ఆటోపముచేత, పంకిల=బురద గలిగిన, అభ్ర=ఆకాశమనెడు, జలధిన్=సముద్రమందు. సాధుప్రసాదంబున్=మంచి నైర్మల్యమును, గూర్చి=చేసి, తగెన్=ఒప్పెను. భూమిన్=పృథివియందు, ఈస్యందినీతతిన్=ఈనదీసమూహమందు, తేటలు=నైర్మల్యములు, ఏకరణిమించెన్=ఎట్లువ్యాపించెను, నానేల=అదియెందుకు, ఆదే=ఆయాకాశనైర్మల్యమే, నదిన్నదిని=ప్రతినదియందు, బింబదంభంబునన్=ప్రతిబింబమిషముచేత, లేదా=ఉండదా.

శా. చక్రంబొక్కటిశింశుమారము భ్రమిం-చం గ్రాంచపున్
గ్రొన్నాట్నముం।
దాక్రీడత్సితవారివాహనివహా-వ్యాకీర్ణతూలాళిని।
ర్వక్రంబై వెలయన్ శరజ్జనిత చే-బర్యాయపర్యస్తమా।
ప్రక్రామ్యత్సితతంతుపఙ్క్తులనఁగా-వ్రాలున్మరాళావళుల్

టీ॥ శింశుమారము= (గ్రహాదులకాధారమై మేరువునం దిరుగుచున్న) శింశుమారమను పేరుగల. చక్రంబు=చక్రము, ఒక్కటి=ఒకటి. భ్రమిం చన్=తిరుగగా, క్రౌంచపుఁ రాట్నమునందున్=క్రౌంచపర్వతమను నూలువ డుకునట్టి యంత్రమందు, ఆక్రీడ......తూలాళి ఆక్రీడత్=అంతటదిరుగు చున్న, సిత=తెల్లని, వారివాహ=మేఘములయొక్క, నివహ=సమూహము నెడి, వ్యాకీర్ణ=ఏకిన, తూల=దూదిపింజెలయొక్క, ఆళి=పఙ్త్తి, నిర్వ క్రంబై=వంకర లేనిదై, వెలయన్=ఒప్పగా, శరజ్జనచేన్=శరత్కాలమ నుమనుసలిదానిచేత, పర్యాయపద్వ్యస్తమాన క్రమముగా వడకఁబడునట్టి, ప్ర క్రామ్య...పఙ్క్తులనఁగాన్- ప్రక్రామ్యత్=ఆరంభమగుచున్న, సిత=తె ల్లనయిన, తంతు=దారములయొక్క, పఙ్క్తులనఁగాన్=వరుసలో యనునట్లు గా, మరాళావళుల్=హంసపఙ్క్తులు. వ్రాలున్=వ్యాపించును.

శా. మంచుల్తాపనతాపవీతికెదురింపన్లేకసప్తచ్ఛదో।
దంచత్పర్ణములాశ్రయించిరవిపక్ష్యాబ్జాళిగంధంబుపు।
ష్పాంచచ్చోరులుదొంగిలించియవియానాకారభేదంబునం।
గొంచున్మించెననన్వనింగపురముల్ఘూర్ణిల్లెవాత్యాహతిన్

టీ॥ మంచుల్=హిమములు, తాపనతాపవీతికిన్ తాపన=సూర్యసంబంధి యగు, తాప=వేడిమియొక్క, వీతికిన్=జికికి, ఎదురింపన్ లేక=ఎదురొడ్డ లేక, సప్త...పర్ణములు. సప్తచ్ఛదా=ఏడాకులయరఁటిచెట్లయొక్క, ఉదం చత్=ప్రకాశించుచున్న, పర్ణములు=ఆకులు, ఆశ్రయించి=పొంది, రవి... గంధంబు రవి=సూర్యునియొక్క, పక్ష్య=పక్షమందైన, అబ్జ=పద్మముల యొక్క, ఆళి=పఙ్త్తియొక్క, గంబు=పరిమళమును, పుష్పాంచచ్చోరు లు=పువ్వులనెడుఒప్పుచున్నదొంగలు, (అరఁటిపువ్వులలోనుండుదొంగలత ను పేరుగలయవయవములనియును ధ్వని) దొంగిలించి=అపహరించి, అవియాన్ వాసన లియ్యఁగా, ఆకారభేదంబునన్=వేఱురూపుచేత, కొంచున్=స్వీక రించుచు, మించెననన్=వ్యాపించెనోయనునట్లు, వనిన్=వనమందు, కపుర

ములల్ = కర్పూరములు, వాత్యాహతిన్ = సుడిగాలి తాకుచేత, ఘూర్ణిల్లెన్ = తిరిగెను.

వ. ఇప్పగిదినుప్పొంచు నింపుసాధించు నప్పురమయోగ్యావసమున.

టీ॥ స్పష్టము.

క. మందసముస్ముఖగర్భము।
నందమ్ముగనమరఁదెలసి-యలసవనలస।
న్మందిరమునవిల్పిరి మే।
నందనివిదలిర్పనంత-నవలాసకులున్॥

పా॥ అంత = అంతలో, నవలాసకులున్. నవలా = మేనకయొక్క, సకులున్ = చెలికత్తెలును, మందసముస్ముఖగర్భమున్. మందా = మెల్లగా, సముస్ముఖ = విజృంభించిన, గర్భమున్ = చూలొటను, అందమ్ముగన్ = సొగసుగా అమరల్ = ఒప్పగా, తెలసి = ఎఱిఁగి, మేనన్ = మేనకను, తనివిదలిర్పన్ = తృప్తియొసంగునట్లుగా, వలసన్మందిరమునన్ = వనమందొప్పుచున్న గృహమందు నిల్పిరి = ఉంచిరి,

సీత॥ అంత = అంతలో, నవలాసకులున్ = నూతనులగు నాట్యము సేయువారు, [అనగా ఆటలాడువారు] ఉత్సవములు జేయువారని యర్థము, మందసముల్ = పెట్టెను, ముఖగర్భముల్ = ఎదుటిభాగమును లోభాగమును, అందమ్ముగనమరల్ = సొగసుగానొప్పఁగా, తెలసి, ఎఱిఁగి, మేనల్ = శరీరమందు, తనివిదలిర్పల్ = తృప్తియొసఁగునట్లు, అలసవనలసన్మందిరమునల్ ఆయుజ్ఞసంబంధియగు ప్రకాశించుచున్న యింటియందు, నిల్పిరి = ఉంచిరి.

క. మందసముదీయమానా।
నందంబులుపొంగిపొరల-నవలాలితని।
ష్పందమతులునుమహీంభృ।
త్సందేశకరుల్ బొసంగ-సవరించునెడన్॥

టీ॥ మంద..... నందంబులు, మంద=మెల్లగా, సముదీయమాన=పుట్టుచున్న, ఆనందంబులు=సంతోషములు, పొంగి=అతిశయించి, పొరలన్=వ్యాపించఁగా, నవలాలు=స్త్రీలును, ఇతరనిష్పందమతులు=ఇతర=పొందబడిన. నిష్పంద=చంచలించని, మతులు=బుద్ధిగలవారును, మహీభృత్సందేశకుల్=హిమవంతుని వార్తాహరులును, ప్రసంగన్=అనుకూలముగా, సవరించు నెడన్=పనులు జేయు సమయమున,

సీ॥ ఉదీయ...నందంబులు ఉదీయమాన=పుట్టుచున్న, ఆనందంబులు=సంతోషములు, పొంగి=అతిశయించి, పొరలన్=వ్యాపించఁగా, నవలాలిత...మతులు. నవ=క్రొత్తగా, లాలిత=గౌరవించఁబడినట్టియు, నిష్పంద=చంచలించని, మతులు=బుద్ధులుగల, మహీభృత్సందేశకుల్=రాజాయొక్క వార్తాహరులు, మంచిసము=పెట్టె, ప్రసంగన్=అనుకూలముగా, సవరించునెడన్=సర్దుబాటుచేయునపుడు.

క. అకలుషమతిమహీభృత్సతి।
ప్రకటోత్సుకభావలబ్ధి-బర్వాంగను నే।
నకమనసుహితముగాఁగ।
న్యక నొయ్యారములకుప్ప-నచటంగనియెన్॥

పా॥ అకలుషమతి=నిష్కలుష బుద్ధిగల. మహీభృత్సతి=హిమవంతుని భార్యయును, మేనక=మేనకాదేవి, ప్రకటోత్సుక భావలబ్ధి బర్వాంగనా=అతిశయమగు వేడుక వ్యాపించఁగా, మనసుహితముగా=మనఃకిష్టముగా, ఒయ్యారములకుప్పన్=విలాసములప్రోవైన, కన్యకన్=పిల్లను, అచటన్=ఆ గృహమందు, కనియెన్=కనెను.

పీ॥ మేనక=మేనకయను అప్సరస, [ఇదియితరాప్సరసల కుపలక్షణము.] ప్రకటోత్సుకభావలబ్ధిన్=అతిశయమగు సంతోషము చేత, పర్వాంగను=(లక్షణచే) నాట్యముచేయుచుఁగా, అప్సరసలాడగా నని యర్థము. మహీభృత్సతి=జనకుని భార్య, అచటన్=ఆ పెట్టెయందు, కనియెన్=చూచెను. శేషము సమానము,

క. తతకనకనగప్రభవను।
మతిగర్భమునంజనించు-మాన్యనుగన్యన్।
క్షితిభృత్పతిగన్గొనితా।
నతికుతుకతరంగితాంత-రంగతఁబొంగెన్॥

టీ॥ క్షితిభృత్పతి=పర్వతశ్రేష్ఠుఁడగుహిమవంతుఁడు, కనకనగప్రభవను=మేరుపర్వతమువలనఁ బుట్టిన సుమతి=మంచిమనసుగల మేనకయొక్క, గర్భమునన్=కడుపునందు, జనించు=పుట్టినట్టి, మాన్యన్=పూజ్యురాలగు, కన్యన్=కన్నియను, కన్గొని=చూచి, తాన్=తాను. అతికుతుకితాంతరంగతన్=మిక్కిలిసంతోషముచేతఁ బొంగుచున్న యంతఃకరణముగలుగుటచేత, పొంగెన్=ఉబ్బెను

సీ॥ క్షితిభృత్పతి=రాజశ్రేష్ఠుఁడగు జనకుఁడు, కనకనగప్రభన్=బంగారుపర్వతమువంటి కాంతిగలిగినట్టియు, వసుమతి గర్భమునన్=భూమియొక్కగర్భమునందు, జనించు=పుట్టినట్టియు, శేషము సమానము.

సీ. జన్నంపుటన్నంపు-టన్నువల్ వెదఁజల్లు,
పారిజాతలతాంత-ధారలలరె।
నాధారలాధార-మైధారుణిఁజనించు,
భృంగమ్ములరవప్ర-సంగమెసఁగె।
నారవంబారూఢ-గౌరవంబై మీర,
గంధగంధవహాను-బంధమొప్పె।
నాగాలలోఁగొని-నాగాలికుంతలల్,
పాటుపాటలకోటి-పరిఢవిల్లె।

గీ కన్యధన్యయనన్యసా-మాన్యమాన్య।
వర్ణ్యలావణ్యసావర్ణ్య-వర్ణవర్ణ।

నీయగాత్రి ధరిత్రి జ-నించినట్టి
కల్యకల్యాణసుముహూర్త-ఘటికయందు॥

టీ॥ ధన్య=ధన్యురాలైనట్టియు, అనన్య...గాత్రి=అనన్యసామాన్య=ఇతరులకు సాధారణము గాని, మాన్య=పూజింపదగినట్టియు, వర్ణ్య=వర్ణింపదగినట్టియు, లావణ్య=శరీరతాళతళ్యము చేతను, సౌవర్ణ=బంగారు సంబంధియగు, వర్ణ=కాంతిచేత, వర్ణనీయ=వర్ణింపదగిన, గాత్రి=శరీరముగల, కన్య=ఆచిన్నది, ధరిత్రిన్=భూమియందు, జనించినట్టి=పుట్టిన, కల్య...యందు, కల్య=ప్రశస్తమైన, కల్యాణ=శుభప్రదమైన, సుముహూర్త=మంచిముహూర్తముయొక్క, ఘటికయందు=గడియయందు, జన్నంపుటన్నంపుటన్నవిల్=యజ్ఞములే యన్నముగల దేవతల స్త్రీలు, విదజల్లు=విరియఁజల్లిన, పారి...ధారలు, పారిజాతలతాంత=పారిజాతపుష్పములయొక్క, ధారలు=ధారావర్షములు, ఎసఁగెన్=ఒప్పెను, ఆధారలు= ఆధారలే=ఆధారమై=జీవనాధారముగానుండి, ధారుణిన్=భూమియందు, చరించు=తిరుగుచున్న, భృంగమ్ముల=తుమ్మెదలయొక్క, రవప్రసంగము=ధ్వనిప్రసక్తి, ఎసఁగెన్=ఒప్పెను, ఆరవంబు=ఆధ్వని, ఆరూఢగౌరవంబై=ప్రసిద్ధగౌరవముగలదియై, మీఱన్=అతిశయించఁగా, గంధ..బంధము, గంధ=పరిమళముతోఁగూడిన, గంధవహ=గాలియొక్క, అనుబంధము=సంబంధము, ఒప్పెన్=ఎసఁగెను, ఆగాలిన్=ఆవాయువును=లోఁగొని=లోఁబరచుకొని, నాగాలి కుంతలల్=నాగకన్యలు, పాడు=గానము చేయునట్టి, పాటల=గానములయొక్క, కోటి=విస్తారము, పరిఢవిల్లెన్=ప్రవర్తించెను,

ఉ. క్రొన్నెలదాల్పువేల్పుజెలు-గుల్ వెలుగుల్ గొనలేటిఘోటిజేఁ
గొన్నవలంతిపిల్లగమి-కొల్లగఁబిల్లమిరెమ్ములేసెమేల్।
జన్నములందు సగ్గితిగ-సప్తసజ్ఞులు తృప్తిఁగాంచెమిం।
చెన్నరతేట తామరలు-చెంగలువల్ గలయేటికోటులన్॥

ఆసమయమందు. ఆర్యులు = పెద్దలు, దినమణి - సూర్యుఁడును, మాణిక్య విశేషమనియుఁ దోచుచున్నది అంబరంబును = ఆకాశమును, వస్త్రమనియుఁ దోచుచున్నది, ఒగిన్ = అనుకూలముగా, ఏగతిన్ = ఏప్రకారము, నిల్చెనో = ఆగెనో, అనిరి = అనిపల్కిరి.

సీ॥ జనకుఁడు = జనకమహారాజు, చంపక...గౌరి = చంపకపుష్ప = సంపెంగపువ్వులవలెను, సువర్ణ = బంగారమువలెను, గౌర = పచ్చనిదియైన, సద్వనరుహపాణి = మంచిపద్మము హస్తమందుఁగల లక్ష్మీదేవి, శేషము సమానము.

క. ఎక్కువగఁబండ్లనమరిన।
చక్కెరలకుమూగుశాఖి-సద్విజవర్గం।
బక్కన్యజననమహమున।
నక్కజముగనొప్పెభావు-కాకరఫణితిన్॥

టీ॥ ఎక్కువగన్ = మిక్కిలిగా, పండ్లన్ = ఫలములతో, అమరిన = కలసిన, చక్కెరలకున్ = పంచదారలకు, మూగు = క్రమ్మిన, శాఖిసద్విజవర్గంబు. శాఖి = వేదశాఖాధ్యయనముఁజేసిన, సద్విజ = మంచిబ్రాహ్మణులయొక్క, వర్గంబు = సమూహము, అక్కన్య = ఆచిన్నదానియొక్క, జననమహమునన్ = జన్మోత్సవమందు, అక్కజముగన్ = ఆశ్చర్యముగా, భావుకాకరఫణితిన్. భావుక = శుభమునకు, ఆకర = స్థానమును, ఫణితిన్ = రీతిచేత. ఒప్పెన్ = ప్రకాశించెను.

వ. అంత॥

క. చిలుకలపిలుకలపలుకల।
కులుకులుగలమొలకువలకుఁ-గొఱతఘటించుం।
జిలిబిలిపలుకులు బలుకుచు।
జలకముకలికికినొసఁగిరి-జవరాలంతుల్॥

టీ॥ చిలుకలపిలుకల= చిలుక పిల్లల యొక్క, పలుకుల= వాక్యములయొక్క, కులుకులుగల= విలాసములుగల, మెలకువలకున్= ప్రౌఢిమలకు, కొరతవుటించుచుంటోటుగలిగించు, బిలిబిలిపలుకులు= వ్యర్థవాక్యములు, పలుకుచున్ = ఉచ్చరించుచు. పొలంతుల్ = స్త్రీలు, కలికికిన్ = అచిన్నదానికి, ఒనర్పన్ = చేయుటకు, చని = వెళ్ళి.

చ. క్రమమునఁ బ్రత్నరత్నపరి-ష్కృతనిర్మలశాతకుంభకుం।
భములసుగంధగంధరస-బంధురమైననఖంపచోదకం।
బమరిచి బాలకుంజలక-మార్చి వడిందడియొత్తి పొత్తులం।
గొమరులుమించనుంచిరళి-కుంతలలంతియలంతదీర్పఁగన్॥

టీ॥ అంత = అంతట, అళికుంతలలు = తుమ్మెదలవంటి ముంగురులుగల స్త్రీలు, అలంతి = ఆయాసము, తీర్పఁగన్ = పోఁగొట్టుటకు, క్రమమునన్ = వరుసగా, ప్రత్న...కుంభములన్ ప్రత్న = పురాతనములగు, రత్న = మణులచేత, పరిష్కృత = అలంకరింపఁబడిన, నిర్మల = శుభ్రములైన, శాతకుంభ = బంగారముయొక్క, కుంభములన్ = ఘటముల చేత, సుగంధ...బంధురమైన. సుగంధ = మంచి పరిమళముగల, గంధరస = గంధోదకముచేత, బంధురమైన, అతిశయించిన, నఖంపచోదకము = గోరువెచ్చనీరు, అమరిచి సిద్ధపరచి, బాలకున్ = చిన్నదానికి, జలకమార్చి = నీళ్ళుపోసి, వడిన్ = త్వరగా, తడియొత్తి = తుడిచి, పొత్తులన్ = సన్నగుడ్డలయందు, కొమరులుమించన్ = శోభలతిశయింప, ఉంచిరి = పరుండఁబెట్టిరి.

క. అతులనతసీతసుమనః।
ప్రతినిధియగుణములేకు-పడసలసవన।
క్షితిలోనంబికనాదము।
హితముగనొక పేరఁబలికి-రింతులు బాలన్॥

తా॥ ఇంతులు=స్త్రీలు, బాలన్=అచిన్నదానిని అతులన్=సామ్యము లేనిదాని, అతసీతసుమనఃప్రతినిధి=అతసీ=అగిసెచెట్టుచేత, ఇత, పొందఁబడిన, సుమనః=పుష్పములకు, ప్రతినిధి=సమానురాలు, అని=అని, గుణము తేరుపడన్=గుణములు స్పష్టముగాగా, అలస...లోన్. అలస=స్పష్టవిశేషములుగలుగునట్లు, వనక్షితిలోన్=వనభూమిలో, అంబికనాన్=అంబికయనఁగా, దమహితమునన్=శాంతగుణమునకు హితమగునట్లుగా, ఒకపేరన్=ఒకనామముచేత, పలికిరి=వచించిరి,

సీ॥ ఇంతులు బాలన్. అతులనతన్=సామ్యము లేకుండుటచేత, సీత=సీత సుమనఃప్రతినిధి=దేవతాసమానురాలు, అనిగుణము తేరుపడన్. అల=అట్టి, సవనక్షితిలోపలన్=యజ్ఞభూమిలోపల, పికనాదమహితమునన్=కోకిలధ్వని చేతఁబూజితమగునట్లు, ఒకపేరఁబలికిరి.

వ. ఆక్రమంబున॥

సీ. పల్లవమ్ములకుసం-పల్లవమ్ములుగూర్చు
పదములోకృటిరెండు-బొదువనేర్చె।
విశ్వంబుఁగబళించు-విశ్వంభరునినామ,
మనుచుఁదానత్తత్త-యనఁగనేర్చె।
బంగారుచవికలో-శృంగారవతులతో,
గురివింజకుప్పలు-గూర్చనేర్చె।
వీణావతులఁగూడి-రాణామృతమునద్వి,
పంచికాతతులవా-యించనేర్చె।

గీ. బాలికారత్నమనుదిన-వర్ధమాన।
కాంతశృంగారనటనరం-గంబులైన।

యంగములనంగజుని చేతి-యసమహేతి।
సానఁబట్టినరీతిము-చ్చటలహెచ్చె॥

టీ॥ బాలికారత్నము = బాలికలయందు శ్రేష్ఠురాలగు నాచిన్నది, పల్లవమ్ములకున్ = చివుళ్ళకు, సంపల్లవంబులు = మిక్కిలి కొంత శోభలను, కూర్పన్ = సంధానముఁ జేయునట్లు, పదములు = అడుగులు, ఒకటిరెండు = కొలదిగా, పొదువనేర్చెన్ = కూర్చ నేర్చెను. విశ్వంబుఁగబళించు = ప్రపంచమును దినునట్టి, విశ్వంభరుని = విష్ణువుయొక్క, నామమును = పేరను తలంచుచు, అత్తత్త యనఁగ నేర్చెన్ = అత్త యత్తయనుట నేర్చెను. "అదభక్షణే" అను ధాతువుపైని తృచ్ప్రత్యయముగాని, తృన్ప్రత్యయముగాని చేర్పఁగా అత్తృ అని ప్రాతిపదికము అయినది. అపైని "డాబవిభాత్రాదేశః, దీర్ఘాణాంహ్రస్వస్యాత్" అను నాంధ్ర వ్యాకరణ సూత్రములచే నీ రూపము [అత్తి] వచ్చెను. బంగారుచవికెలోన్ = బంగారుమండపములోపల. శృంగారవతులతోన్ = స్త్రీలతోడ, గురవింజకుప్పలు = క్రీడావిశేషములు, కూర్చ నేర్చెన్ = ఆడనేర్చెను, వీణావతులన్ = వీణలుగల స్త్రీలను, కూడి = కలసి, రాణామృతము = అమృతమువంటిధ్వని, రణశబ్దే అను ధాతువుపై ఘఞ్ ప్రత్యయముఁ జేర్పఁగా రాణ అనురూపము వచ్చినది సంగీతమని యర్థము. సద్విపంచికాతతులన్ = మంచి వీణాసమూహములయందు, వాయింపనేర్చెన్ = ధ్వనింపనేర్చెను. అనుదిన...రంగంబులైన. అనుదిన = ప్రతిదినమందు, వర్ధమాన = వృద్ధిఁబొందుచున్న, కాంత = మనోహరమైన, శృంగారనటన = శృంగారనాట్యమునకు, రంగంబులైన = రంగస్థలములైన, అనఁగా శృంగారప్రచురములయిన. అంగములన్ = అవయవములచేత, అంగజుని చేతి = మన్మథుని చేతిలోని, అసమహేతి = సమానములేనికత్తి, సానఁబట్టినరీతిన్ = సానపైనూరినట్లుగా, ముచ్చటలన్ = శోభలచేత, హెచ్చెన్ = అతిశయించెను.

క. బాల్యంబుజారెమన్మథ।
లౌల్యంబలరారెనంత-లజ్జాసమమై।

కాల్యమున నలినికిం బఱెఁ।

కల్యంబగుజవ్వనంబు-గలికికిఁబొడమెన్॥

టీ॥ కలికికిన్ = చిన్నదానికి, బాల్యంబు = బాలత్వము, జారెన్ = వదలెను, మన్మథలౌల్యంబు = కామము చేతనయిన చాంచల్యము- లజ్జాసమమై = సిగ్గుతో సమానమయి. (అనఁగా మన్మథలౌల్యమును సిగ్గును గూడ) అలరారెన్ = ప్రకాశించెను, కాల్యమునన్ = ప్రాతఃకాలమందు, నలినికిం బఱెన్ = తామరపాదకువలె, కల్యంబగు = మంచిదగు, జవ్వనంబు = యౌవనము, పొడమెన్ = అంకురించెను-

చ. కుటిలములయ్యెఁగోమలికిఁగుంతలముల్ బెళుకుల్ కనుంగవం।

బుటమరిలెంజనుంగవయుఁ-బోకలరేకలఁబ్రాకెఁబల్కులం।

జటులలితంబులొప్పెనర-చందురుచందముఁజెందెమోముపొ।

క్కిటగహనత్వముల్లసిలెఁ-గెంపులకెంపుదలిర్చెవాతెరన్॥

టీ॥ కోమలికిన్ = స్త్రీకి, కుంతలముల్ = ముంగురులు, కుటిలములయ్యెన్ = వంకరలయ్యెను, కనుంగవన్ = నేత్రద్వంద్వమందు, బెళుకుల్ = చాంచల్యములు, పుటమరిలెన్ = ఉబ్బెను, చనుంగవయున్ = కుచద్వంద్వమును, పోకలరేకలన్ = పోకచెక్కలరీతిని, ప్రాకెన్ = వ్యాపించెను, పల్కులన్ = వాక్యములయందు, చటులలితంబులు = చంచలములగువిలాసములు, ఒప్పెన్ = ప్రకాశించెను, మోము = ముఖము, [నుదురని తాత్పర్యము] అరచందురు చందమున్ = అర్ధచంద్రునిరీతిని, చెందెన్ = పొందెను, పొక్కిటన్ = నాభియందు, గహనత్వము = లోతు, ఉల్లసిలెన్ = ప్రకాశించెను, వాతెరన్ = అధరోష్ఠమందు, కెంపులకెంపు = కెంపులయెఱుపు, తలిర్చెన్ = ఒప్పెను,

ఉ. బాలికయుంగరాజ్యమున-బాల్యపుమంత్రినిజప్రభావముల్।

తూలఁగఁద్రొబ్బిరానతని-ముంచఁగయౌవనమంత్రినుంచిత।

ల్లాలితమధ్యపుష్టినఖిలంబుగ్రహించిమనోజరాజు।

ద్వైలతఁ గూర్చ్చ లిబ్బులన - దేలెఁ గుచంబులు చంద్రఫాలకున్ ॥

టీ॥ మనోజరాజు = మన్మథుఁడను రాజు, బాలిక = చిన్నదాని యొక్క, అంగరాజ్యమునన్ = శరీరమను రాజ్యమందు, బాల్యపు మంత్రిన్ = శిశుత్వమనెడు ప్రధాని, నిజప్రభావముల్ = తన సామర్థ్యములు, మూలకుఁ ద్రొబ్బి తాన్ = మూలకు ద్రోసి వేసిరాఁగా, అనఁగా బాల్యమందు మన్మథచేష్టలుండవని తాత్పర్యము- అతనిన్ = ఆ బాల్యమంత్రిని, ముంచఁగన్ = అణఁచివేయుటకు, యౌవనమంత్రిన్ = యౌవనమను ప్రధానిని, ఉంచి = ఏర్పాటు చేసి, తల్లాలితమధ్యపుష్టిన్- తత్ = ఆయంగరాజ్యము యొక్క, లాలిత = గారవింపఁబడు, మధ్యపుష్టిన్ = నడుము యొక్క పుష్టిని, మధ్యదేశమందలి యైశ్వర్యమనియు- అఖిలంబు = అంతయును, గ్రహించి = పుచ్చుకొని, అను ద్వైలతన్ = అతిశయము లేకుండుటచేత, అనఁగా మెల్లమెల్లగా నని యర్థము- కూర్చ్చి = సంధానముఁ జేయఁబట్టి, లిబ్బులవన్ = ధనము ప్రోగులన్నట్లుగా. కుచంబులు = స్తనములు, చంద్రఫాలకున్ = చంద్రునివంటి ఫాలము గల స్త్రీకి. తేలెన్ = బయలు దేరెను.

చ. జలజరజంబుఁ జంద్రసుధఁ - జంచలచారుచకచ్చకచ్ఛవుల్ ।
మలయపుగాలి శూలివన - మానసఖంబును నేర్చి కూర్చి క్రొం ।
దలిరుకటారివీరుఁ డుద - సర్పఁగఁ బోలుఁ బడంతిఁ గానిచో ।
బలియునె మ్మేపగంధరస - భాస్వరశీతసువర్ణవైఖరుల్ ॥

టీ॥ క్రొందలిరుకటారి = క్రొత్తచివుళ్ళు కత్తిగల, వీరుఁడు = మన్మథుఁడు, జలజరజంబున్ = పద్మపరాగమును, ఇది పంచభూతములలో భూమ్యంశము- చంద్రసుధన్ = చంద్రుని యమృతమును ఇది జలాంశము- చంచల = మెరపు యొక్క, చారుచకచ్చకచ్ఛవుల్ = సుందరములగు చకచక యను కాంతులును, ఇది తేజోంశము- మలయపుగాలిన్ = మలయపర్వత వాయువును, ఇది వాయ్వంశము- శూలి...ఖంబును- శూలి = ఈశ్వరుని యొక్క, వన = వనమందలి, మానస = మానససరస్సునందయిన, ఖంబును = ఆకాశమును, ఇది యాకాశాంశము- ఏర్చి = ఏరి, కూర్చి = కలిపి, పడంతిన్ = ఈ చిన్నదానిని,

తనర్పఁగఁబోలున్ = చేయఁబోలును, మనోవ్యాప్తి పంచభూతముల మేళనవలనఁ గలుగును గావున నిట్లుఁ జెప్పఁబడెను. కానిచోన్ = అట్లు గానియెడల, మేనన్ = శరీరమందు, గంధ...వైఖరుల్ - గంధ = పరిమళముయొక్కయు, రస = అభిరుచియొక్కయు, భాస్వర = ప్రకాశముయొక్కయు ఇది భావప్రధాననిర్దేశము- శీత = చలువయొక్కయు, సువర్ణ = మంచిరంగుయొక్కయు, వైఖరుల్ = రీతులు, గలియునె = అతిశయించునా!

సీ. కచభరంబుఘనాళి-గరిమచేవిలసిల్లుఁ,
గమలవిభ్రమరీతి-నమరుఁ జూపు।
కమలలక్షణలక్ష్మి-గణియించుమొగమోష్ఠ,
మరుణబింబపురక్తి-నవఘళించు।
సుమనశ్చటాహార-సురుచిరంబగునవ్వు,
తాళవృత్తతపయో-ధరములెనయు।
విపులచక్రమురీతి-వెలయునితంబంబు,
తారాకృతివహించుఁ-దతనఖములు।
గీ. ఘనమణులుదమ్మిలేళ్ళరిం-ఖణములింపు।
కమలములుబింబరవులశో-ణిమలుసుమము।
లమృతమునుదాళఫలముతా-ళమరిధరణి।
ముత్తెములుభంబులోనఁగూడె-ముదితమేన॥

టీ॥ కచభరంబు = వెండ్రుకలగుంపు, ఘనాళి గరిమచేన్. ఘన = మేఘములయొక్క, అళి = పఙ్క్తియొక్కయనియు, ఘన = గొప్పవియగు, అళి = తుమ్మెదలయొక్క, అనియు నర్థము గరిమచేన్ = గొప్పదనముచేత, విలసిల్లున్ = ప్రకాశించును, చూపు = దృష్టి, కమలవిభ్రమరీతిన్ కమల = పద్మములయొక్కయనియు, లేళ్ళయొక్క యనియు నర్థము. విభ్రమ = విలాసములయొక్క, రీ

తిక్ = క్రమముచేత, అమర్ = ఒప్పును, మొగము = ముఖము, కమలలక్షణ లక్ష్మిక్. కమలలక్షణ = లేడిచిహ్నములుగల చంద్రునియొక్క యనియు, కమల = పద్మములయొక్క, లక్షణ = రీతులయొక్క యనియునర్థము. లక్ష్మిక్ = శోభను, గణియింపక్ = లెక్కించును, ఓష్ఠము = పెదవి, అరుణ బింబపురక్తిక్. అరుణ = ఎఱ్ఱనైన. బింబపు = దొండపంటి యొక్క, అరుణబింబపు = సూర్యబింబముయొక్క, రక్తిక్ = ఎఱుపును, అపహసించున్ = తిరస్కరించు. నవ్వు = స్మితము, సుమనశ్ఛటాహార సురుచిరంబు. సుమనః = పుష్పములయొక్క, ఛటా = సమూహముయొక్క, హార = మాలికవలెనని యును సుమనశ్ఛటా దేవతా సమూహముయొక్క, ఆహార = భోజనపదార్థముగు నమృతమువలెనని యునర్థము. సురుచిరంబు = మిక్కిలి మనోహరమైనది అగున్ = ఔను. పయోధరములు = స్తనములు. తాళవృత్తత. తాళ = తాటిపండ్లయొక్క యనియు తాళముల యొక్క యనియు నర్థము. వృత్తత = వర్తులత్వమును. ఎనయున్ = పొందును, నితంబంబు = పిఱుదు విపులచక్రమురీతిన్ - విపుల = విస్తారమైన చక్రము = బండిగల్లు యొక్క యనియు, విపుల చక్రము = భూచక్రము యొక్క, యనియు నర్థము- ఇది తెలుగు షష్ఠీ సమాసము గావున విపులా శబ్దమునకు హ్రస్వము గలిగెను- రీతిక్ = క్రమము చేత, వెలయుక్ = ఒప్పును, తత నఖములు = విస్తారముగు గోళ్ళు, తారాకృతిక్ = తార = ముత్యములయొక్క యనియు, నక్షత్రములయొక్క యనియు నర్థము, ఆకృతిక్ = ఆకారమును, వహించుక్ = పూనును, గీతచరణములయందు శ్లేష భంగిచేతఁ నిదివరలో చెప్పినవస్తువులఁ జెప్పుచున్నాఁడు. ఘనము = మేఘమును, అళులు = తుమ్మెదలును, తమ్మి = బద్మమును, లేళ్ళ = మృగములయొక్క రింఖణములు = తొట్రుపాటులున్న, గర్వములని తాత్పర్యము. ఇందుకమలములు = చంద్రపద్మములును, బింబపుల = దొండపంటియొక్కయు సూర్యనియొక్కయు, శోభలు = ఎఱుపులును, సుమములు = పువ్వులును, అమృతమును = సుధయును, తాళఫలము = తాటిపండును, తాళము = వాయించుకొనునట్టితాళమును, అరి = బండిచక్రమును, ధరణీస్వామియును, ముత్తెములు = ము

త్యములును, భంబులు=చుక్కలును, ముదితమేనక్=చిన్నదానిశరీరమందు
ఒనఁగూడెన్=తారసించెను,

క. వింటికిసరిబొమక్రానల।
వింటికినరిదొరకవెంత-విఱవీగిననా।
ప్పంటికినలకంటికినల।
పంటికినలసాక్షిగుబ్బ-పాలిండ్లసిరుల్॥

టీ॥ బొమ=కనుబొమ, వింటికిన్=ధనస్సునకు, సరి=సమానము, క్రాను=
నడుము, అలవింటికిన్=ఆయాకాశమునకుసరి, సమానము, అలసాక్షి=మంద
దముతైననేత్రములుగలచిన్నదానియొక్క, గుబ్బపాలిండ్ల=గుండ్రనైనస్తనము
లయొక్క, సిరుల్=శోభలు, అలపంటికిన్=ప్రసిద్ధమగుకవలమునకును, అల
పంటికిన్=ప్రసిద్ధమగుకలశమునకును, ఎంతవిఱవీగినన్=ఎంతగర్వపడినను,
ఎప్పంటికిన్=ఏకాలమునకును, దొరకవు=లభించవు.

సీ. నీలలీలలనేలు-వాలవాలభరంబు,
పద్మసంపదఁగాంచుఁ-బడఁతిమొగము।
రంభసంభ్రమమెంచు-రమణీయూరుయుగంబు,
హేమభూమవహించు-వింతికాంతి,
శ్యామకోమలరీతి-సవరించుమెఱుఁగారు,
చిత్రరేఖనుమించుఁ-బత్రరేఖ।
తారసారులగేరుఁ-దరుణిపాదనఖాళి,
మినుకుకొమ్మనుమీఱు-మెలఁతభుజము॥

గీ. గానసీచానయసమాన-మానసకల।
మానినీమానసీయలీ-లానిధాన।

మిన్నెలఁతనెన్నఁగాఁ బన్న-గేశ్వరునకు।
భూరిముఖములు నిర్మింపఁ-బోలు ధాత॥

టీ॥ బాలవాలభరంబు = చిన్నదాని కేశసమూహము, నీలలీలలన్ = ఇంద్రనీలముల విలాసములను, విష్ణుభార్యయగు నీలాదేవియొక్క విలాసములని ధ్వని. ఏలున్ = శాసించును, వదనమొగము = చిన్నదానిముఖము, పద్మసంపదన్ = తమ్మియొక్క శోభను, లక్ష్మీదేవియొక్క శోభనని ధ్వని. కాంచున్ = పొందును. రమణీయూరుయుగంబు = చిన్నదానితొడలజోడు, రంభసంభ్రమము = అరటిచెట్టుయొక్క యాటోపమును, రంభయనునప్సరసయొక్క యాటోపమునని ధ్వని, ఎంచున్ = లెక్కపెట్టును, ఇంతి కాంతి = చిన్నదాని కాంతి, హేమగుణమున్ = బంగారముయొక్క గొప్పతనమును, హేమయనునప్సరసయొక్క గొప్పతనమునని ధ్వని, వహించున్ = పొందును, మెఱుఁగారు = మెఱుఁగైనట్టి, శ్యామకోమలరీతిన్ = పల్లవికోమలమైనపద్ధతిని, శ్యామయనునప్సరయొక్క కోమలరీతియని ధ్వని, సవరించున్ = దిద్దును, పత్రరేఖ = మకరికాపత్రరేఖ, చిత్రరేఖను = చిత్రమైనపద్ధతిచేతను, చిత్రరేఖయనునప్సరసను, అని ధ్వని. మించున్ = అతిశయించును, తరుణీపాదనఖాళి = చిన్నదానిపాదపుగోళ్ళవరుస, తారసౌరులన్ = నక్షత్రముశోభను, తారయనుబృహస్పతి భార్యయొక్క శోభనని ధ్వని, కేరున్ = హాస్యముఁ జేయును, మెలఁతభుజము = చిన్నదానిబాహువు, మినుకుకొమ్మను = తళుకుగలతీగను, సరస్వతినని ధ్వని మీరున్ = అతిశయించును, గానన్ = కనుక, ఈచాన = ఈ చిన్నది, అసమానమాన = సమానములేనిగౌరవముగల, సకలమానినీ = సమస్తస్త్రీలకును, మాననీయ = గౌరవింపఁదగిన, లీలా = విలాసములకు, నిధానము = నిధియైనది, ఇన్నెలఁతన్ = ఈ చిన్నదానిని, ఎన్నఁగాన్ = వర్ణించుటకు, ధాత = బ్రహ్మ, పన్నగేశ్వరునకున్ = శేషునకు, భూరిముఖములు, = చాలానోళ్ళు, నిర్మింపఁబోలున్ = చేయఁబోలును.

క. నీలమ్ములు వాలమ్ములు।
నీలమ్ముల శ్రీలు దేలు-నిగనిగమనుచున్।

గ్జాలమ్ములుఁజాలమ్ములు।
జాలమ్ములలీలనేలుఁ-జంద్రాననకున్॥

టీ॥ చంద్రాననకున్ = చంద్రునివంటి ముఖముగల చిన్నదానికి, వాలమ్ములు = కేశములు, నీలమ్ములు = నల్లనివి, నిగనిగమును = నిగనిగలాడెను, దృగ్జాలమ్ములు = దృష్టిసమూహములు, జాలమ్ముల = వలలయొక్క, జాలమ్ముల = కపటములయొక్క, లీలన్ = విలాసమును, ఏలున్ = శాసించును.

సీ. కన్నెకన్నులతోడ-వన్నెలెన్నఁగవచ్చి,
సారసమ్ములునీర-సత్వమొందె।
నాతినేత్రములతో-నీతులాడఁగవచ్చి,
నల్లగల్వలువేగ-నయమునొందెఁగా।
కాంతకన్గవతోడ-గరిమఁబూనఁగవచ్చి,
మీనజాలమునుళ్ళ-లోనమునిఁగె।
మగువదృగ్యుగళితో-నిగనిగల్గొనవచ్చి,
నెలవుల్లుగవలువ-ర్తిలఁగనరసె।

గీ. తమ్ములకుఁగమ్ములిందీవ-రమ్ములకువ।
రమ్ములుసుమీలకుఁ స్త్రీల-సమ్ములలచ।
కోరికలకును.కోరికల్-కొమిరెమేలు।
వాలుగన్నులువర్ణింప-వశమెవరికి॥

టీ॥ సారసమ్ములు=పద్మములు, కన్నెకన్నులతోడన్=చిన్నదాని నేత్రములతో, వన్నెలెన్నఁగవచ్చి=శోభలెంచుటకువచ్చి, నీరసత్వము=రసహీనతను, నీటియందునికిని యును, ఒందెన్=పొందెను, నాతి నేత్రములతోన్=చిన్నదానికన్నులతో,నీతులాడఁగవచ్చి=నీతులు పలుకగవచ్చి, ఇందీవరములు

వేగన్ = త్వరగా, తెల్లవారఁగావనియును, నయముఁజూపెన్ = అందమును బోఁగొట్టుకొనెను, కాంతికన్గవతోడన్ = చిన్నదాని నేత్రద్వంద్వముతో, గరిమబూనఁగవచ్చి = గౌరవము నొందవచ్చి, మీనజాలము = చేపలగుంపు, సుళ్ళలోనన్ = నీటిసుడులయందు, కష్టముఁ బొందవనియును, మునిగెన్ = మునిఁగిపోయెను, మగువదృగ్యుగళితోన్ = చిన్నదాని నేత్రద్వంద్వముతో, నిగనిగల్ గొనవచ్చి తాళతక్యము నొందవచ్చి, వెలపుల్గుగవలు = చకోర ద్వంద్వములు, వర్తిలఁగన్ = సంచరించుటకు [ఈ పాఠము సరియయినదని తోఁచదు] అరసెన్ = చూచెను. తమ్ములకున్ = పద్మములకు. తమ్ములు = సహోదరులు, ఇందీవరములకున్ = నల్లగల్వలకు, వరమ్ములు = శ్రేష్ఠములు. మీలకున్ = చేపలకు ఉన్మీలనమ్ములు, కనులుమూయుటయియును. అలచకోరికలకున్ = ఆస్త్రీచకోరములకు, కోరికల్ = కామితములును, ఐవట్టి, కొమిరె = చిన్నదానియొక్క, వాలుగన్నులు = విశాలనేత్రములు, వర్ణింపన్ = వర్ణనఁజేయుటకు, ఏవరికిన్ = ఎవరికైనను, వశమె = స్వాధీనమా.

ఉ. కమ్మనిపల్కు తేనెలర-కమ్మని కుల్కుకుచమ్ము చక్రవా।
కమ్మని మేనికాంతి కన-కమ్మని బెళ్కుచూపుచేవపొం।
కమ్మని చెక్కు చంద్రఫల-కమ్మని క్రొమ్మెఱుఁగారు దందశూ।
కమ్మని కొప్పు తేటికుల-కమ్మని పల్కెద నీలవేణికిన్॥

టీ॥ నీలవేణికిన్ = నల్లనిజడగలచిన్నదానికి, కమ్మఁబల్కులు = సువిగలవాక్యములు, తేనెలరకమ్మని = తేనెలదిసుసనియును, కుల్కుకుచమ్ము = శృంగారముగలస్తనము, చక్రవాకమ్మని = చక్రవాకపక్షియని, మేని కాంతి = శరీరచ్ఛాయ, కనకమ్మని = బంగారమనియును, బెళ్కుచూపుచేవ = చంచలమయిన దృష్టియొక్కబలము, పొంకమ్మని = సొగసయినదనియును, చెక్కు = గండస్థలము, చంద్రఫలకమ్మని = చంద్రకాంతమనియును, క్రొమ్మెఱుఁగారు = నిగనిగలాడెడునూగారు, దందశూకమ్మని = పాపమనియును, కొప్పు = కేశభారము, తేటికులకమ్మని = తుమ్మెదగుంపనియును, పల్కెదన్ = చెప్పెదను.

గీ. ఇంతిసల్లపనస్ఫూర్తి - యించుకమరు
రాజునకు మత్తకోకిల - రాజునకును
తరుణి యుచ్చరణస్ఫూర్తి - దనరుఁగొంత
శుకములకు నతివికచకిం - శుకములకును॥

టీ॥ ఇంతి=చిన్నదానియొక్క, సల్లపనస్ఫూర్తి- సత్=శ్రేష్ఠమయిన లపన=ముఖముయొక్క, సల్లపన=పలుకుబడియొక్కయు, స్ఫూర్తి=స్ఫురణము, ఇంచుక=కొంచెము, రాజునకున్=చంద్రునికి, మత్తకోకిల రాజునకును=మదించినకోకిలశ్రేష్ఠమునకును, అమరున్=ఒప్పును, తరుణి=చిన్నదానియొక్క, ఉచ్చరణస్ఫూర్తి- ఉచ్చరణ=పలుకుబడియొక్క, ఉత్=ఔన్నతమయిన, చరణ=పాదములయొక్కయు. స్ఫూర్తి=స్ఫురణము, శుకములకును=చిలుకలకును, అతివికచకింశుకములకును=మిక్కిలివికసించిన మోదుగపువ్వులకును, కొంత=కొంచెము, తనరున్=ఒప్పును-

చ. కలికిమొగంబుడంబునకుఁ - గాశశిపద్మములాఢ్యపుష్కర
స్థలినిసదాతపస్స్ఫురణఁ - దాల్చుతజిన్వకలంకసౌరభో
జ్జ్వలతనుబద్మమొందెనలచందముఁజందురుఁడందఁడయ్యెసౌ
కలుషముగాదెమేదినిసిఁ - గారణమిద్వరివైరవృత్తికిన్॥

టీ॥ శశిపద్మములు=చంద్రపద్మములు, కలికి=చిన్నదానియొక్క, మొగంబుడంబునకుఁగాన్=ముఖశోభకై, ఆఢ్యపుష్కరస్థలిని- ఆఢ్య=మంచిదియగు, పుష్కరస్థలిని=తీర్థవిశేషమందు, ఆకాశస్థలమందనియు, నీటిస్థలమందనియు నర్థములు- తపస్సు తీర్థవిశేషమందుఁ జేయుదురుగదా- ఇదియుభయత్రసమము- ఆకాశమందని చంద్రపక్షమందును, జలమందని పద్మపక్షమందును, ఇట్లు మూఁడర్థములు గూర్చికొనవలయును- సదా=ఎల్లప్పుడును. తపస్స్ఫురణన్=తపస్సుయొక్క స్ఫూర్తిని, సత్=యోగ్యమయిన, ఆతప=ఎండయందు, స్ఫురణన్=వికాసమునని యు, తాల్చుతజిన్=ధరించినప్పుడు

నకలంకసౌరభోజ్జ్వలతను=కలంకరాహిత్యమును, బరిమళముచేఁ బ్రకాశించు టయును, పద్మము=తమ్మి, ఒందెన్=చెందెను, అలచందమున్=ఆరీతిని, చందురుఁడు=చంద్రుఁడు, అందఁడయ్యెన్=పొందఁడాయెను, అకలంకము= అదోషము, మేదినిన్=భూమియందు, ఇద్వరి=ఇదటియొక్క, వైరవృత్తికిన్=విరోధవ్యాపారమునకు, కారణముగాదె=హేతువుగాదా.

గీ. కొమ్మకేలిం బలరుఁ లేత-కొమ్మకేలి।
మేచకముల చ్చెలియ నెరుల్-మేచకములు।
తియ్యవిరుఁ బొందవను మోవి-తియ్యవిరుచి।
యించుకమ్ముని చేవింటి-యించుకమరు॥

టీ॥ కొమ్మకేలు=చిన్నదానిచేయి, లేతకొమ్మకేలిన్=లేతకొమ్మయొక్క విలాసముచేత, ఇంపలరున్=శోభించును, మేచకములు=నల్లనైన, అచ్చెలియ=ఆచిన్నదానియొక్క, నెరుల్=వెండ్రుకలు, మేచకములు= నెమలిపింఛములు, తియ్యని=మధురమగు రుచిన్=రుచిచేత, తనరు= ఒప్పుచున్న. మోవి=అధరము, తియ్యని=వెనుకఁదీయనట్టి, రుచి=మాధుర్యము, ఇంచుక=కొంచెము, మరుని=మన్మథునియొక్క, చేవింటి= చేతిలోనిధనుస్సుయొక్క, ఇంచుకున్=చెఱకునకు, అమరున్=ఒప్పును.

చ. కలహమునం బరస్పరముఁ-గన్పడుచున్నలకున్ విభాగవుం।
గలసల పాత్రులొప్పకొనఁ-గా ముఁదుయావనమంత్రి చేసము।
జ్జ్వలతనలగ్నపత్రమునఁ-బట్టిలిఖింపఁగఁ జేయునట్టుర।
ములనల తారుబంతియనఁ-బొటిలుగొప్పి మ్మెయింగారు బోటికిన్।

టీ. కలహమునన్=విరోధముచేత, పరస్పరమున్=అన్యోన్యము, కన్పడు=అతిశయించుచున్న, కన్నులకున్=నేత్రములకు, విభాగవుంగలన= పంపకపుచోటు, అలపాత్రులు=ప్రసిద్ధులైనపాత్రులు. మందములగు నేత్రములవిలయు, ఒప్పుకొనన్=అంగీకరించఁగా, [illegible]=మన్మథుఁడు,

నిష్కలంకసౌరభోజ్జ్వలతను=కలంకరాహిత్యమును, బరిమళముచేఁ బ్రకాశించుటయును, పద్మము=తమ్మి, ఒందెన్=చెందెను, అలచందమున్=ఆరీతిని, చంద్రుఁడు=చంద్రుఁడు, అందఁడయ్యెన్=పొందఁడాయెను, అకలుషము=అదోషము, మేదినిన్=భూమియందు, ఇర్వురి=ఇద్దఱియొక్క, వైరవృత్తికిన్=విరోధవ్యాపారమునకు, కారణముగాదె=హేతువుగాదా.

గీ. కొమ్మకేలింపలరు లేత-కొమ్మకేలి।
మేచకములచ్చెలియ నెరుల్-మేచకములు।
తియ్యని రుచిం దనరు మోవి-తియ్యని రుచి।
యించుక మగుని చేవింటి-యించుకనురు॥

టీ॥ కొమ్మకేలు=చిన్నదానిచేయి, లేతకొమ్మకేలిన్=లేతకొమ్మయొక్క విలాసముచేత, ఇంపలరున్=శోభించును, మేచకములు=నల్లనయిన, అచ్చెలియ=ఆచిన్నదానియొక్క, నెరుల్=వెండ్రుకలు, మేచకములు=నెమలిపింఛములు. తియ్యని=మధురమగు రుచిన్=రుచిచేత, తనరు=ఒప్పుచున్న. మోవి=అధరము, తియ్యని=వెనుకఁదీయనట్టి, రుచి=మాధుర్యము, ఇంచుక=కొంచెము, మగుని=మన్మథునియొక్క, చేవింటి=చేతిలోనిధనుస్సుయొక్క, ఇంచుకున్=చెఱకునకు, అనురున్=ఒప్పును-

చ. కలహమునం బరస్పరముఁ-గన్పడుచున్నలకున్విభాగపుం।
గలనలసాత్త్వులొప్పుకొనఁ-గాముఁడుయౌవనమంత్రి చేసము।
జ్జ్వలతవలగ్నపత్రమునఁ-బట్టిలిఖింపఁగఁ జేయునట్టుర।
ములనలరారు బంతియనఁ-బొటిలుగొబ్బిమ్మెఱుఁగారు బోటికిన్॥

టీ. కలహమునన్=విరోధముచేత, పరస్పరమున్=అన్యోన్యము, కన్పడు=అతిశయించుచున్న, కన్నులకున్=నేత్రములకు, విభాగపుంగలన=పంపకపుచేటు, అలసాత్త్వులు=ప్రసిద్ధులైనసాత్త్వులు. మందములగు నేత్రములనియు, ఒప్పుకొనన్=అంగీకరించఁగా, కాముఁడు=మన్మథుఁడు, యౌ

వసమంత్రితేఁ=జవ్వనమనెడుప్రధానిచేత, సముజ్జ్వలతఁ=ప్రకాశముచే. త, వలగ్నపత్రముఁ=నడుమనెడునాకుపై, పట్టి=పట్టికొని, లిఖింపఁగఁజేయు- వ్రాయుంపఁజేసిన, అక్షరమ్ములఁ=వర్ణములచేత, అలరారు=ఒప్పుచున్న, బంతియుఁ=పఙ్క్తియనునట్లు, క్రొమ్మెఱుఁగారు=క్రొత్తకాంతులుగలుగు నూగారు, బోటికిఁ=చిన్నదానికి, అలరారుఁ=ప్రకాశించెను.

సీ. రదపాళికెదురించి-తాలేకపాలిండ్ల,
గౌరవంబువహించెఁ-గోరకములు।
తనుకాంతికాసించి-తానిల్వలేమికి,
కేతకినెరికొప్పు-రీతిఁగాంచె।
నెరతొడలనుబోలి-దరహితస్థితిఁగాంచి,
కదళికల్ నఖరస-సంపదలఁబొదలె।
మెఱుఁగారుగణియించి-మిగులవాదిగనిల్చి।
శైవాలముపిఱుందు-చాయనెనసె।
గీ. మధుకరమ్ములుకుంతల-ప్రథిమనొంది।
క్రమముగానద్వితీయవ-ర్ణముగనిల్చి।
జంఘలకుఁగ్రిందుపడెనోర-జలజనేత్ర।
గాత్రములదీటులచరిత్ర-చిత్రమయ్యె॥

టీ. కోరకములు=మొగ్గలు, రదపాళికిఁ=దంతపఙ్క్తికి, ఎదురించి=ఎదురై తాలేక=వచ్చుటకుసామర్థ్యములేక, ర అనునక్షరములేకయనియర్థము-కోరకశబ్దమందు 'ర' లేకుం డేకోకమగును చక్రవాకములనియర్థము-పాలిండ్లగౌరవంబుఁ=స్తనములయౌన్నత్యమును, వహించెఁ=పూనెను, కేతకి=మొగలిపువ్వు, తనుకాంతికిఁ=శరీరకాంతికి, ఆశించి=ఆశపడి, తానిల్వలేమికిఁ=తానాగ లేకుండుటకు, త అను నక్షరము నిలువకుండుట

టకు ననియునర్థము- కేతకిశబ్దమందు త నిలువకుంటే కేకియగును- నెమలియనియర్థము- కొప్పు రీతిన్=కొప్పుయొక్క పద్ధతిని, గాంచెన్=పొందెను, కదళికల్=అనటులు, నెరతొడలను=మంచివియగుతొడలను, పోలి=పోలినవియై, దరహితస్మితన్=కొంచెమిష్టమగురీతిని, కాంచి=పొంది, ద=దకారముతోడ, రహిత=శూన్యమగు, స్థితిన్=ఉనికిని, కాంచి=పొందియనియునర్థము. కదళికల్ అనుశబ్దమునందు "ద" శూన్యమయితే కళికల్ అనియగును- మొగ్గలనియర్థము, నఖరసంపదలన్= గోళ్ళయొక్క శోభలచేత, పాదలెన్=వృద్ధిఁనిబొందెను, శైవాలము=నాచు, మెఱుఁగారున్=మెఱుఁగైననూగారును, గణించి=లెక్కించి, మిగులన్=మీరుటకు, వాదిగన్=వాదముచేయునదిగా, నిల్చి=ఉండి, 'వ' అనునక్షరముదిగిపోఁగా నిలచి. శైవాలశబ్దమునందు- 'వ' అనునక్షరముదిగిపోగా- శైలము అగును, పర్వతమనియర్థము- పిఱుందుచాయన్=కటియొక్క శోభను, ఎసఁగెన్=పొందెను, మధుకరమ్ములు=తుమ్మెదలు, కుంతలప్రథిమన్= ముంగురులగొప్పతనమును, ఎంచి=లెక్కించి, క్రమముగాన్=తిన్నగా, అద్వితీయవర్ణముగన్=రెండవవర్ణము లేనిదిగా, అనగా సామ్యములేనిదై- రెండవయక్షరము లేనిదై యనియునర్థము- మధుకరశబ్దమునందు రెండవయక్షరము లేకుంటే మకరమ్ములు అగును- మొసళ్ళనియర్థము జంగలకున్=పిక్కలకు, క్రిందుపడెన్=తక్కువాయెను. కౌర=ఆశ్చర్యము. జలజనేత్రి=చిన్నదానియొక్క, గాత్రముల=అవయవములయొక్క, దీటుల=సమానవస్తువులయొక్క, చరిత్ర=చరితము చిత్రమయ్యెన్=ఆశ్చర్యమాయెను.

క. మెఱుఁగుపసిండికి వాసన।

చెఱకునకున్ సత్ఫలంబు-సృజియింపని యా।

కొఱచెలిమేనినిజిగివా।

తెఱయును నిర్మించిధాత-తీర్చికొనియెన్॥

టీ. మెఱుఁగుపసిండికిన్=మెఱుంగుబంగారమునకు, వాసన=పరిమళమును, చెఱకునకున్=ఇక్షువునకు, సత్ఫలంబు=మంచిపండును, సృజియింపని=నిర్మింపనట్టి, ఆకొఱఁత=ఆలోటు, చెలిమేనిని=చిన్నదానిశరీరమును, జిగివాతెఱయును=నునుపైనయధరోష్ఠమును, నిర్మించి=చేసి, ధాత=బ్రహ్మ, తీర్చికొనియెన్=పోఁగొట్టుకొనెను.

సీ. సరసులలోనన-బ్జములున్నఁబనియేమి,
విషములసంగతి-విడువవెపుడు।
కళలన్నెలకునెన్ని-గలిగినఁబనియేమి,
దోషాకరఖ్యాతి-దొలఁగదెపుడు।
కవజక్కవలువృత్త-గతినున్నఁబనియేమి,
తమినెడఁదొరులఁగూడు-క్రమములేదు।
ఘనులలోనమెఱుంగు-గలసినంతనెయేమి,
చాంచల్యమొక్కఁతె-జారలేదు।

గీ. కాననీచానకనుదోయి-కాననముఁ
కబ్బురపుగబ్బిగుబ్బల-కంగమునకు।
జలజచయచంద్రచక్రచం-చలలసరిగ।
బలుకనుచితంబుగాదిట్లు-దలఁచిచూడ।

టీ. అబ్జములు=పద్మములు, సరసులలోన్=రసయుక్తులయిన వారిలో, మడుగులలోననియు. ఉన్నన్=ఉంటచేత, పనియేమి=కార్యమేమి గలదు, విషముల=ఉదకములయొక్క, గరళములయొక్కయనియు, సంగతి=స్నేహము, ఎపుడు=ఎన్నఁడును, విడువదు=వదలదు, ఆ నెలకున్=ఆచంద్రునికి, కళలు=పదియాఱవభాగములు, శాస్త్రములనియు, ఎన్నిగలిగినన్, పనియేమి=కార్యమేమి, దోషాకరఖ్యాతి=పాపములకుస్థానమనుప్రసిద్ధి, రాఁ

నిందేయము వాఁడను ప్రసిద్ధియనియు, ఎప్పుడుఁదొలఁగదు=ఎన్నఁడును పోదు, కవజక్కవలు=జోడైన చక్రవాకములు, వృత్తిగతిన్=మంచినడతచేత, వర్తులరీతి చేతననియును, ఉన్నఁబనియేమి=ఉన్నకార్యమేమి, తమిన్=అనురాగముచేత, రాత్రియుంపనియు, ఒండొరులఁగూడుక్రమము లేదు=అన్యోన్యముగలిగియుండుట లేదు, మెఱుఁగు=మెఱుపు. ఘనులలోనన్ గొప్పవారిలో మేఘములలోననియును, కలసినంతనె యేమి=కూడినంతమాత్రముననేమి ప్రయోజనము, చాంచల్యము=చంచలత్వము, ఒక్కింతెజారలేదు=కొంచెమైనఁబోలేదు, కాన్=కాబట్టి, ఈచాన=ఈచిన్నదానియొక్క, కనుదోయికిన్=నేత్రద్వంద్వమునకును, ఆననమునకున్=ముఖమునకును, ఉబ్బురపుగబ్బిగుబ్బలకున్=ఆశ్చర్యమైనగొప్పకుచములకును, అంగమునకున్=శరీరమునకును, జల...చలలన్=జలజచయ=పద్మసమూహమును, చంద్ర=చందురుని. చక్ర=చక్రవాకములను, చంచలన్=మెఱపును, ఇట్లువలఁచిచూడన్=ఈప్రకారమాలోచించిచూడఁగా, సరిగన్=సమానముగా, పలుకన్=చెప్పుటకు ఉచితంబుగాదు==అర్హముగాదు.

క. వదనము వాణీవల్లభ|
పదమును మధ్యంబు విష్ణుపదమును గెలువన్ ||
పదలికయీసతితొడలకుఁ|
గదళిక లేపగిదిఁబోల్పఁగాఁదగు నొక్కో||

టీ. వదనము=ముఖము, వాణీవల్లభపదమును=బ్రహ్మకుస్థానమగుపద్మమును, మధ్యంబు=నడుము, విష్ణుపదమును=ఆకాశమును, గెలువన్=జయించఁగా, సదలిక=మంచినునుపుగల, ఈసతి=ఈచిన్నదానియొక్క, తొడలకున్=ఊరువులకు, కదళికల్=అఁటిని, నిందితము సదళికయనియునర్థము,. సదళికయొక్కతొడలకుఁగదళికను బోల్పరాదని తాత్పర్యము. ఏపగిదిన్=ఏప్రకారము, పోల్పఁగాఁదగునొక్కో=సాటిచేయుఁదగునో.

సీ. అలరుబంతులటంచు-నాడవచ్చునుగాని,
యలరుబంతులటంచు-నాడరాదు॥
భద్రకుంభములంచుఁ-బలుకవచ్చునుగాని,
భద్రకుంభములంచుఁ-బలుకరాదు॥
వృత్తతాళములంచు-నెంచవచ్చునుగాని,
వృత్తతాళములంచు-నెంచరాదు॥
అతనుకోశములంచు-నరయవచ్చునుగాని,
యతనుకోశములంచు-నరయరాదు॥

గీ. గుణమున సువర్ణమనురక్తి-గుప్తిగలిగి।
విభ్రమరమాప్తమకరికా-విలసనంబు।
విద్రుమలతోపగమక్లృప్త-విలసనంబు।
నెయ్యురుబాలపాలిండ్ల-దోయినిపుడు॥

టీ- ఇచట సీసచరణములకును గీతచరణములకును సంబంధము గలుగున ట్లుగా జెప్పఁబడినది- గుణమునను=వర్తులత్వాదికమునను [అలరుబంతులపక్షమున] దారమునని యర్థము- సువర్ణమునను=మంచిరంగును, (భద్రకుంభపక్షమున) బంగారమునని యర్థము- అనురక్తి=అనురాగమును (వృత్తతాళపక్షమున) ఎఱుపునని యర్థము గుప్తి=రవికకప్పు [అతనుకోశపక్షమున] దాపరికమునని యర్థము, కలిగి=ఉండి, విభ్రమ........లసనంబు=విభ్రమరమా=విలాసలక్ష్మి చేత, ఆప్త=పొందఁజడిన=మకరికా=మకరికాపత్త్రములయొక్క,విలసనంబు=విలాసముగలదియు- విద్రుమ........లసనంబు, విద్రుమలతా=పగడపుతీగలయొక్క, ఉపగమ=పొందుటచేఁ, క్లృప్త=రచింపఁబడిన విలసనంబు=విలాసముగలదియు, ఐ=అయి, అలరు=ప్రకాశించునట్టి, బాలపాలిండ్లదోయికి

చిన్నదాని స్తనద్వంద్వమును, ఇపుడు=ఇప్పుడు, అలరుబంతులటంచున్ = పుష్పములబంతులని. ఆడవచ్చునుగాని = పలుకవచ్చునుగాని, అలరు = శోభించునట్టి, బంతులటంచున్ - కందుకములని, ఆడరాదు = పలుకఁగూడదు - భద్రకుంభములంచున్ - బంగారు కలశములని, పలుకవచ్చునుగాని = చెప్పవచ్చునుగాని, భద్రకుంభములంచున్ = ఏనుగుకుంభస్థలములని, పలుకరాదు = వచింపఁగూడదు, వృత్తతాళములంచున్ = వర్తులములగు తాటిపండ్లని, ఎంచవచ్చునుగాని = ఎన్నవచ్చునుగాని, వృత్తతాళములంచున్ - వర్తులములగు తాళపుచిప్పలని, ఎంచరాదు = ఎంచఁగూడదు, అతనుకోశములంచున్ = మన్మథుని ధనరాసులని. అరయవచ్చునుగాని = చూడవచ్చునుగాని, అతనుకోశములంచున్ = గొప్ప మొగ్గలని, అరయరాదు = చూడఁగూడదు-

క. కామినికన్గవకాంతులు।
సోమకళావిలసనంబుఁ-జూపుచుఁ బెనులీ।
లామీనాకృతిఁబూనఁగ।
నోమలికిన్ శ్రుతులు శ్రీల-గుటసందియమే॥

టీ. కామినికన్గవకాంతులు = స్త్రీయొక్క నేత్రద్వంద్వముయొక్క కాంతులు, సోమకళావిలసనంబు = చంద్రకళయొక్క విలాసమును, చూపుచున్ = కనఁబరచుచు, పెను = విస్తారమగు, లీలా = విలాసముచేతనయిన, మీనాకృతిన్ = మత్స్యాకారమును పూనఁగన్ = ధరించఁగా, కోమలికిన్ = స్త్రీకి, శ్రుతులు = చెవులు, శ్రీలగుట = శ్రీకారములగుట, లక్ష్ములగుటయని యునర్థము- సందియమే = సంశయమా, ఇచట నేత్రములయందుఁ దెల్లని రంగుగలిగియుండుటంగావునఁ జంద్రకళాసామ్యముఁ జెప్పెను, కన్నులు చంద్రకళావిలాసమును మీనాకారమును ధరించుట చేత సముద్రమందుఁ బుట్టిన చంద్రమత్స్యములున్న చోట సముద్రమునందే పుట్టిన శ్రీయుండుటను సందేహము లేదని తాత్పర్యము-

చ. మనసనుప్రోలినేలునెఱ-మావిశరమ్ములదంటనిస్తుల
స్తనగిరిదుర్గయుగ్మముతు-దన్నిలపెన్ మకరాంకుఁడప్డుచ
య్యనఁజనునాభికూపపుత-టంకముచేఁబదలగ్నకృష్టమై
పనుపడునాచుతీవయెగఁ-బ్రాఁకెనసందగునాఱునాతికిన్॥

టీక. మనసనుప్రోలిన్ = చిత్తమనెడుపట్టణమును, ఏలు = పాలించునట్టి, నెఱమావిశరమ్ములదంట = శ్రేష్ఠములగు మామిడిపువ్వుల బాణములుఁగల నేర్పరియగు మన్మథుఁడు, నిస్తుల...తుదన్ — నిస్తుల = సామ్యములేని, స్తన = కుచములనెడు, గిరిదుర్గయుగ్మము = పర్వతదుర్గద్వంద్వముయొక్క, తుదన్ = చివరను, మకరాంకము = మకరికాపత్రములనెడు మొసలిజెండాను, నిలపెన్ = ఉంచెను. చయ్యనన్ = శీఘ్రముగా, చను = వెడలునట్టి, నాభికూపపు = నాభియను నూతియందలి, తదంకముచేన్ = ఆమన్మథుని చిహ్నమగు చేపచేత. నూతియందుఁ జేపయుండుట న్యాయముగనుక యట్టిచేపయొకటి నాభికూపమునందుండి మన్మథుని ధ్వజమీనమును జూచి పైకెగసెనని తాత్పర్యము. పదలగ్నకృష్టమై = పాదమందుఁ దగులుకొన్నట్టిదియు, లాగఁబడినట్టిదియునై. చేపకుఁ బాదములు లేకున్నను పాదములవంటి యవయవముల నే అట్లు నిర్దేశించినాఁడు. పనుపడు = బాగగు, నాచుతీవ = శైవలలత, ఎగఁబ్రాఁకెనన్ = ఎగఁబ్రాఁకినదో యనునట్లు, నాతికిన్ = స్త్రీకి, ఆఱు = నూఁగారు, తగున్ = ఒప్పును.

సీ. పాలఁతిపాదపయోజ-ములపేరనవనిలోఁ,
బ్రబలఁగాఁబోలుఁబ-ల్లవచయంబు।
కలువకంటికటాక్ష-ములపేరఁబుడమివ,
ర్ధిలఁబోలువాలుగ-న్నులకులంబు।
కలకంఠికాలంది-యలపేరవర్థిల్లఁ,
గాఁబోలువరహంస-కవ్రజంబు।

కుందసుందరహాస-కుంతలమ్ములపేర,
నమరఁబోలునుమద-భ్రమరకంబు|

గీ. లాకులతనున్న వలఁగొన్న-నమరభంగి|
ములఁబడినవెల్ల యెడలను-మొరయిడినను|
మించుచిగురులువాలుగ-లంచలభులు|
గాంచఁజాలవుశృంగార-మిఁచుకైన||

టీ|| పల్లవచయంబు=చిగుళ్ళసమూహము, మఱియు, పత్=పాదముల యొక్క, లవ=లేశములయొక్క, చయంబు=సమూహమనియునర్థము, ఈ యర్థము పాదములపేరఁ బ్రబలఁబోలు నని చెప్పుట కుపయోగించుచున్నది. ముందుఁగూడ నిట్లూహించవలయును. పాలఁతిపాదపయోజములపేరన్= స్త్రీయొక్క పాదపద్మములపేరితో, అవనిలోన్=భూమిలో, ప్రబలఁగాఁ బోలున్=అతిశయించఁబోలును, వాలుగన్నుల- వాలుగ=వాలుగచేపల యొక్క, అన్నుల=స్త్రీలయొక్క, కులంబు=జాతి, మఱియు, వాలు=దీర్ఘములగు, కన్నుల=నేత్రములయొక్కయనియునర్థము- కలువకంటికటాక్షములపేరన్=స్త్రీయొక్క క్రేఁగంటిచూపులపేరుతో, పుడమిన్=భూమి యందు, పరిలఁబోలున్=వృద్ధిఁ బొందఁబోలును పరహంసకవ్రజంబు- పర=శ్రేష్ఠమయిన, హంసక=అంచలయొక్క, వ్రజంబు=సమూహము- మ ఱియు, హంసక=కాలికడియములయొక్కయనియునర్థము, కలకంఠి కాలం దియలపేరన్=అచిన్నదానిపాదములయందలియందెలపేరుతో, పరిలఁగాఁ బోలున్=వృద్ధిఁబొందఁబోలును, మదభ్రమరకంబులు- మద=మదముతోఁ గూడిన, భ్రమరకంబులు=తుమ్మెదలు, మఱియు, భ్రమరకంబులు=ముంగురు లు. కుందసుందరహాస=మల్లిపువ్వులవలె సుందరమయిన నవ్వుగల స్త్రీ యొక్క, కుంతలమ్ములపేరన్=ముంగురులపేరితో, అమరఁ బోలును=ఒప్పఁ బోలును, ఆకులతనున్నన్=ఆకులత్వముచేతనున్నను, [పల్లవము] ఆకు లత యందున్నదనియును, వలఁగొన్నన్=ప్రదక్షిణముఁజేసినను, [వాలుగలు]

వేలలోఁ బడె ననియును, అమరన్ = ఒప్పునట్లు, భంగములఁబడినన్ = హానులఁ బొందినను, (హంసలు) తరంగములలోఁ బడె ననియు ఎల్లకొలఁకులను = అన్నిచోటుల, మొలయికినన్ = ముట్టఁబెట్టుకొన్నను, (తుమ్మెదలు) ధ్వనిచేసెననియు, మించు చిగురులు = అతిశయించు పల్లవములును వాలుగలు = వాలుగచేపలును, అంచలు = హంసలును, అళులు = తుమ్మెదలును ఇంచుకైనన్ = కొంచెమైనను, శృంగారము = సౌందర్యమునని లాక్షణికారము. కాంచఁజాలవు = పొందలేవు.

మ. ఘనశృంగారపుఁదీఁగయౌవనవనిం-గందర్పుఁడన్ హాలికుం।
డునెరాపొక్కిటిపాదునిల్పఁదనరె-న్నూగారునాదానిమీఁ।
దనవోష్ఠారుణబింబడంబరరతిన్-ద్వంద్వంబయ్యెజక్కవల్।
దనరెంజన్నులునాఁగనింతిముఖచం-ద్రశ్రీభయస్తబ్ధమై॥

టీ. యౌవనవనిన్ = జవ్వనము తోఁటయందు, కందర్పుఁడన్ = మన్మథుఁడనెడు, హాలికుండు = సేద్యగాఁడు, నెరా = ప్రశస్తమైన, పొక్కిటిపాదు = నాభి యనెడుపాదు, నిల్పన్ = ఉంచఁగా, దానియందని యధ్యాహారము. ఘనశృంగారపుఁదీవ = గొప్పదియగు శృంగారమనెడు తీగ, నూగారునాన్ = రోమావళియను పేరుచేత, తనరెన్ = ఒప్పెను. దానిమీఁద = దానిపైని, నవోష్ఠారుణబింబడంబరరతిన్ = నూతనమగు నధరోష్ఠమనెడు సూర్యబింబము యొక్క యాటోపమందాసక్తిచేత - చక్రవాకములకు సూర్యబింబమందాసక్తికలుగుట ప్రసిద్ధము. ద్వంద్వంబయి = జోడై, జక్కవల్ = చక్రవాకములు, చన్నులునాఁగన్ = స్తనములను పేరితో, ఇంతి = ఆచిన్నదానియొక్క, ముఖ...స్తబ్ధమై - ముఖచంద్ర = ముఖమను చంద్రునియొక్క, శ్రీ = శోభయొక్క, భయ = భీతిచేత, స్తబ్ధమై = కొయ్యవారి, తనరెన్ = ఒప్పెను. చక్రవాకములు చంద్రునికి జడియుట ప్రసిద్ధము.

సీ. పడఁతిమేల్పడతలా-పరమహంసలకైన,
పతిసఖస్థితులుస-ద్వ్రతతికైన,

వనితకన్గవకాంతి-యనిమిషావళికైనఁ,
గన్నెపెన్నెఱిగుంపు-ఘనులకైన।
వనజాక్షివదనమీ-శ్వరశిఖామణికైన,
వెలఁదిపలుకులుశుకా-దులకునైన।
హరిణాక్షియఱిగౌను-హరికైనఁబల్లవా,
ధరయూరులుసరిస-తరులకైనఁ।
గీ. బట్టివర్ణింపనలవిగా-దిట్టులుండ।
సతివయాసొంపులాపెంపు-లానెఱాణ్ము।
యారములుబీరములునుశృం-గారములును।
దరమెలెక్కింపఁదర్కింప-నరులకెపుడు॥

టీ॥ ఈపద్యమందుపమానవస్తువులకును బూజ్యులకును శ్లేషద్వారాయాధిక్యవసాయముఁ జేసినాఁడు- పడఁతిమేల్నడతలు=ఆచిన్నదాని మంచిగమనములు, ఆపరమహంసలకైనన్=ప్రసిద్ధులగుజ్ఞానులకయినను, గొప్పహంసలకనియును, సతిసఖిస్థితులు=ఆచిన్నదాని గోళ్ళరీతులు, సద్వ్రతతికైనన్=యోగ్యులసమూహమునకైన, నక్షత్రసమూహమునకనియును, వనితకన్గవకాంతి=ఆచిన్నదాని నేత్రద్వంద్వముయొక్క కాంతి, అనిమిషావళికైనన్=దేవసమూహమునకైనను, ఱెప్పపాటులేని చేపలసమూహమునకనియును, కన్నెపెన్నెఱిగుంపు=చిన్నదానికేశసమూహము, ఘనులకైనన్=గొప్పవారికైనను, మేఘములకయినననియు, వనజాక్షివదనము=స్త్రీయొక్క మొగము, ఈశ్వరశిఖామణికైనన్=ఈశ్వరశ్రేష్ఠులకయినను, శివునిశిరోమణియగుచంద్రునకనియును, వెలఁదిపలుకులు=చిన్నదానిమాటలు. శుకాదులకునైనన్=శ్రీశుకుఁడుమొదలగువారికయిన. చిలుకలు మొదలగువాని కనియును, హరిణాక్షియఱిగౌను=చిన్నదానిసన్నమగునడుము, హరికైనన్=విష్ణువుకయినను, సింహమునకనియును, పల్లవాధరయూరులు=చిన్నదానితొడలు,

సరసతరులకై నన్ = మిక్కిలిసరసులగువారికయినను, రసయుక్తములగుచెట్లకనియును, పట్టి=పూని, వర్ణింపన్ = వర్ణనఁజేయుటకు, అలవిగాదు = శక్యముగాదు, ఇట్టులుండఁగ్ = ఈరీతినుండఁగా అతివ = చిన్నదానియొక్క, ఆసాంపులు = ఆసాగసులు, అపెంపులు = అయతిశయములును, ఆనారాయొయ్యారములు = ఆగొప్పవిలాసములును, బీరములును = బిగువులును, శృంగారములును = శృంగారచేష్టలును, నరులకున్ = మనుష్యులకు, ఎపుడును = ఎన్నఁడును, లెక్కింపన్ = గణనసేయుటకును, తర్కింపన్ = ఊహించుటకును, తరమె = శక్యమా?

క. కాంచనకళికాంచనమును।
గాంచెంబంకేజపాణి-ఘననాసికయు।
మ్మించులమించులమించిర।
మించులతాలలితగాత్రి-మేనిమెఱుంగుల్॥

టీ॥ పంకేజపాణిఘననాసిక = పద్మములవంటిహస్తములుగల చిన్నదానిముక్కు, కాంచనకళికాంచనమును = సంపెంగమొగ్గయొక్క గౌరవమును, కాంచెన్ = పొందెను. లతాలలితగాత్రి = తీగవలె సుందరమగు శరీరముగల స్త్రీయొక్క, మేనిమెఱుంగుల్ = శరీరకాంతులు. అమ్మించులమించుల = ప్రసిద్ధమగు మెఱపుల కాంతులను, మించి = అతిశయించి, రమించున్ = క్రీడించును.

మ. కలయుస్మీనముద్విస్వభావగరిమం-గన్దోయిదంభంబునన్।
వెలయందచ్చననుచ్చభావముగుటన్-విచ్చేయుశుక్రుండునా॥
నలరున్మంగరము త్రైమంగనకుఁద-ధ్యాబిచ్చలింగాంచుచో।
నలఘుండాతఁడుగన్నకన్యకిలనై-చ్యంబెంచవేదేజనుల్॥

టీ॥ మీనరాశి ద్విస్వభావ రాశియనియు శుక్రున కది యుచ్చయనియు. ఉచ్చకు నేడవరాశియగు కన్యారాశి నీచయనియు, గ్రహములన్నియుఁ దా

మున్ను రాశియందుండి యేడవ రాశిం జూచును గావున మీనమందున్న శుక్రుండు కన్యారాశిం జూచుననియు, జ్యోతిశ్శాస్త్రప్రసిద్ధములు. ఈ పద్యము దానిననుసరించి చెప్పుచున్నాడు. కలయన్ = వ్యాపించునట్లుగా, మీనము = చేప, మీనరాశియనియును, ద్విస్వభావగరిమన్ = చరస్థిర స్వభావగౌరవముచేత, కన్దోయి = ఆచిన్నదాని నేత్రద్వంద్వము యొక్క, దంభంబునన్ = మిషముచేత, వెలయున్ = ఒప్పుంగా, తెచ్చున్ = కపటముచేత, ఉచ్చభావము గుటన్ = ఉన్నతత్వము గుటచేత, ఉచ్చరాశి యనియును, విచ్చేయు = వచ్చినట్టి శుక్రుండు నాన్ = శుక్రుండే వీరాయనానట్లు, ఉంగరముత్తెము = ఉంగరమునందలి ముత్తెము, అంగనకున్ = స్త్రీకి, అలరున్ = ఒప్పును, తథ్యంబు = నిశ్చయము, ఇచ్ఛాలింగనంబు చోన్ = ఈచిన్నదానిం జూచునపుడు, అలఘుండు = గొప్పవాండగు. అతండు = అశుక్రుండు, కన్నెకన్యకున్ = చూచినకన్యరాశికి, కన్నట్టిచిన్నదానికి [అనంగా దేవయానికి] జనుల్ = మనుష్యులు. నైచ్యంబు = నీచత్వమును, ఎంచలేరే = ఆలోచించలేరా.

స నానాప్రసూనాళి-లోనారసివసంతుం,
డసమశౌరభవసార-మొసగ నొసంగ।
ధారాళధారాసు-ధారాసుజాబిల్లి,
నెదకిసారముం దెచ్చి-పద నొనర్చ।
సంపాతశంపాళి-నింపారుచకచకల్,
ఘనులోకగుమ్మగం జే-కొనితనర్చ।
శృంగారముంగారం-బొంగారుటంగారు,
మేరులేర్పరచిన-మ్మికరయొసంగ॥

గీ. బచ్చవిలుకాండులచ్చి పై-యచొచ్చెనర్చి।
యచ్చరలు మెచ్చమచ్చటల్-హెచ్చవిచ్చ।

విచ్చెలినిఁ జేసెఁ గానిచో-నింతవింత।
చక్కఁదనమొక్కటనెట్లు-పిక్కటిల్లు॥

టీ. వసంతుఁడు=వసంతర్తువు, నానాప్రసూనాళిలోన్=సమస్తపుష్పవర్గ్గములో, అరసి=చూచి, సౌరభసారము=మంచిపరిమళము, ఎసఁగన్=ఒప్పునట్లు, ఒసఁగన్=ఇయ్యఁగా, జాబిల్లి=చంద్రుఁడు, ధారా........రాశిలోన్=ధారాళ=అడ్డులేని, ధారా=ధారారూపమైన, సుధా=అమృతముయొక్క, రాశిన్=ప్రోగునందు, వెదకి=వెదకి, సారముదెచ్చి=మెఱుఁగుఁదెచ్చి, పదనొనర్పన్=తడివేయఁగా, ఘనులు=మేఘములు, సంపాతశంపాళిన్=సంపాత=బాగ ప్రసరించుటతోఁగూడిన, శంపా=మెఱుపుయొక్క, ఆళిన్=పఙ్క్తియందు, ఇంపారు=సొగసైన, చకచకల్=తళతళలు, ఒకగుమిగన్=ఒకప్రోగుగా చేకొని=పుచ్చుకొని=తనర్పన్=అతిశయించఁగా, మేరువు=మేరువుపర్వతము, శృంగారముంగారన్=శృంగారమొప్పునట్లు, పొంగారు=అతిశయించినట్టి, బంగారు=బంగారము, ఏర్పరచి=ఏరి, నమ్మికన్=నమ్మకముచేత, ఒసంగన్=ఈయఁగా, పచ్చవిల్తుఁడు=మన్మథుఁడు, లచ్చిపైన్=లక్ష్మీమీఁద, అచ్చొప్పనర్చి=అచ్చొత్తి, అచ్చరలు మెచ్చన్=అప్సరస్త్రీలు పొగడునట్లుగా, (అప్సరలసౌందర్యమును మించినదని తాత్పర్యము) ముచ్చటల్ హెచ్చన్=ఆనందములతిశయించఁగా, ఇచ్చన్=ఇచ్ఛచేత, ఇచ్చెలిని=ఈచిన్నదానిని. చేసెన్=రచించెను, కానిచోన్=కానట్టయితే, ఇంతవింతచక్కఁదనము=ఇంతచిత్రమగుసౌందర్యము, ఒక్కటన్=ఒక్కచోట, ఎట్లుపిక్కటిల్లున్=ఎట్లుగావిజృంభించును-

మ. కన్నుల్ గాంచిచకోరకంబు పరిరాఁ-గానుచ్ఛవర్ణంబుతో।
మిన్నాదంతములందలంచుచు సము-న్నీలద్విరేఫస్థితిం।
జన్నుల్ గాఁచినఁ గోపవృత్తి నవిపై-సాధింపఁ గంఠంబు మేల్!
చెన్నుల్ గోరుచు సుళ్ళఁ బొందెనవలా-శ్రీలబ్బునే యేరికిన్॥

టీ॥ చకోరకంబు=చకోరపక్షి. కన్నుల్ గాంచి=నేత్రములనుజూచి, నేత్రములతో సామ్యముం బొందం దలంచియనిభావము- ఉచ్చవర్ణంబుతోన్=ఉన్నతమగు కాంతితోం గూడి, సరిరాగాన్=సరివచ్చుట, మిన్నా దంతములన్=శ్రేష్ఠములగు దంతములను, తలంచుచున్=తలపోయుచు, (ఉచ్చవర్ణంబుతోన్=ఉత్కృష్టమయిన, అనఁగా విడువఁబడిన, చకారముతో] చకోరకంబు అను శబ్దమందు చవర్ణము విడువఁగా, కోరకము అయినది- మొగ్గయనియర్థము- అవిదంతములసామ్యమొందినదని భావము, సము...సితిన్=సముస్సీలత్=అతిశయించుచున్న, విరేఫ=నింద్యముగాని, సితిన్=శనికిచేత, జన్నుల్ గాంచినన్=స్తనములఁ జూడఁగా, [విరేఫసితిన్=రఅను నక్షరము లేనియూనికిచేత] చకారముపోఁగామిగిలిన కోరకశబ్దమందు రేఫము పోఁగా 'కోకంబు' అయినది. చక్రవాకమనియర్థము, అది స్తనములతో సామ్యమునకువచ్చెనని భావము. అవి ఆస్తనములు, కోపవృత్తిన్=కోపవ్యాపారముచేత, పైసాధింపన్=అధికములుగాఁగా, కంఠంబు=కుత్తుకయొక్క, మేల్ చెన్నుల్ మంచిశోభలు, కోసుచున్=కోయుకొనుచు, (కోపవృత్తిన్- కో=కో యను నక్షరముయొక్క, అపవృత్తిన్=నివారించుటచేత) మిగిలిన కోకంబు అను శబ్దమందు కో అను నక్షరమునుదీసి వేయఁగా, కంబు అయినది- శంఖమనియర్థము- అదికంఠముసామ్యముగోరుచున్నదని భావము. సుళ్ళఁ బొందన్=బాధలఁ బొందనని లాక్షణికార్థము. శంఖమునను లోపల సుడిదిరిగియుండునని భావము. ఏరికిన్=ఎవరికైనను, నవలా=ఆచిన్నదానియొక్క, శ్రీలు=శోభలు, అబ్బునే=దొరకునా.

సీ. ఘనచంపకస్నేహ-మునమించుముంగురుల్,
భ్రమరకంబులటంచు-భ్రమయరాదు।
వలరేనినెనరుబా-టిలుచాననయనముల్,
వాలుగన్నులటంచుఁ-బలుకరాదు।

సీ. ఘనచంపకస్నేహ-మునమించుముంగురుల్,
భ్రమరికంబులటంచు-భ్రమయరాదు।
వలజేసినెనరుబా-టిలుచానయనముల్,
వాలుగన్నులటంచుఁ-బలుకరాదు।
అనిశోజ్జ్వలస్ఫూర్తి-గనుబాలఫాలంబు,
చంద్రకాంతమటంచుఁ-జనువరాదు।
ఇలనల్లనవనదం-బులఁబొసంగమిజెడ,
కృష్ణవేణియటంచు-నెంచరాదు।
గీ. మదమధువ్రతవితతులు-మత్స్యపతులు।
హరిణకిరణాశ్మములు-నదుల్ హరిణనయన।
కుంతలదృగాస్యశ్రేణుల-గురుసమాఖ్య।
లేకతంబునవహించు-నేకతమున॥

టీ. ఘన...స్నేహమునన్, ఘన=గొప్పదియగు, చంపకస్నేహమునన్=సంపెంగనూనెచేత, సంపెంగపువ్వులమైత్రిచేతననియు, మించు=అతిశయించునట్టి, ముంగురుల్=అలకములు, భ్రమరకంబులటంచున్=తుమ్మెదలనుచు, భ్రమయరాదు=భ్రమపడఁగూడదు, తుమ్మెదలైనచో చంపకస్నేహమున మించవనితాత్పర్యము. భ్రమరకములని ముంగురులకుఁ బేరు. వలజేసిన=మన్మథునియొక్క, వలలకునధికారియగు పల్లెవానియొక్కయునియు, నెనరు=స్నేహమును, పాటిలు=పొందిన, చానయనముల్=ఆచిన్నదాని నేత్రములు, వాలుగన్నులటంచున్=ఆడువాలుగలనుచు, పలుకరాదు=చెప్పఁగూడదు, ఆడువాలుగలైనచోఁ బల్లెవాని నెనరు బాటిలవనితాత్పర్యము. వాలుగన్నులని నేత్రములకు పేరు. అని...స్ఫూర్తిన్, అనిశ=ఎల్లప్పుడు, నిశేతరకాలమందు [అనఁగాఁబగటియందు] అనియుఉజ్జ్వల=ప్రకాశించుచున్న స్ఫూర్తిన్=స్ఫురణను, కను=పొందునట్టి, బాలఫాలంబు=ఆచిన్నదానిలలాటము, చం

ద్రకాంతమటంచున్ = చంద్రకాంతమణియని , చదువరాదు = చెప్పటకూ డదు, చంద్రకాంతమైనచోఁ బగటియం దుజ్జ్వలన్మూర్తిగనదని తాత్పర్యము. చంద్రకాంతయు (చంద్రునివలె సుందరమైనది) అని నుదుటికిఁ బేరు, ఇలన్ = భూమియందు, అల్ల = ప్రసిద్ధములై , నవ = నూతనములగు, నదంబులన్ = పురుషనదములచేత, అల్లనన్ = తిన్నగా, నవదంబులన్ = మేఘములచేతననియు, పొసంగమిన్ = అనుకూలించకుండుటచేత, [జడపక్షమున మేఘములను మించియున్నదని భావము] జడ = జట, కృష్ణవేణియటంచున్ = కృష్ణవేణీనదియని ఎంచరాదు = తలఁచఁగూడదు. నదియైనచో నదములఁబొసంగునని తాత్పర్యము. కృష్ణవేణి = నల్లనిజడ యని జడపేరు. మదమధువ్రతవితతులు = మదయుక్తములగు తుమ్మెదలసమూహములును, మత్స్యసతులు = ఆడుచేపలును, హరిణకిరణాశ్మములు = చంద్రకాంత మణులును, నదుల్ = ఏఱులును, హరిణనయన = ఆచిన్నదానియొక్క, కుంత... వేణులు — కుంతల = ముంగురులయొక్కయు, దృక్ = నేత్రములయొక్కయు, ఆస్య = ముఖముయొక్కయు, వేణుల = జడయొక్కయు, గురుసమాఖ్యలు = గొప్పపేరులు, ఏకతంబునన్ = ఒంటరితనముచేత, ఏకతంబునన్ = ఏహేతువుచేత. వహియించున్ = ధరించు.

వ. ఇప్పగిది ముప్పిరిఁగొను జవ్వనంబుప్పతిల్లఁ జొప్పడి యొప్పుల కుప్పయగు నప్పొలఁతుక యప్పుడప్పుడరవిప్పపికులందలిర్చు పుప్పొడికుప్పలఁ దెప్పలు దేలుచు, నిప్పుకలచొప్పున త్రొక్కులప్పళింపుచుఁ గుప్పగంతులం గుప్పళించు నళులు గప్పికొనఁ జొప్పడు పూఁజప్పరమ్ముల గుప్పుగుప్పున లేఁగదువలి దలిర్పు నుప్పరంబెగయు కప్పురంపుఁదిప్పల నపికల్పకల్పనలఁ దోడునీడలగు ప్రౌఢచేడియలతోడ నాడుచుం బాడుచునుండి యొక్కనాఁడు మనోవినోదంబున.

టీ. స్పష్టము.

సీ. పాటీరకోటీర-కోటీసమాటీక,
మానమందమరుత్కు-మారగతులు।
నాళీకపాళీమృ-ణాళీకబళనైక,
పాకపాకమరాళ-బహువిహృతులు।
సారంగకీరాంగ-నారంగనారంగ,
పరిపక్వఫలపరం-పరలరుచులు।
వేలాపగాలాప-లీలాపరపికావ,
ళీలాలితమహాకుహూలలితము॥

గీ. తైందవశిలాకలాపని-ష్యందములును।
సారమారందసారణీ-ధోరణులును।
విలసిలునుకానుకవిలాస-విపినమునను।
దోడు చేడియలనుగూడి-యాడఁదలఁచి॥

టీ. పాటీర...గతులు — పాటీరకోటీర=శ్రేష్ఠములైన మంచిగంధపుచెట్లయొక్క, కోటీ=కొనలయందు. బహువృక్షములయందనుట, సమాటీకమాన=సంచరించుచున్న, మరుత్కుమార=పిల్లవాయువులయొక్క, గతులు=సంచారములును, నాళీక...హృతులు — నాళీకపాళీ=పద్మపఙ్క్తులయొక్క, మృణాళీ=తూండ్లయొక్క, కబళ=తినుటయే, ఏకపాక=ముఖ్యపరిపాకముగల, పాకమరాళ=పిల్లహంసలయొక్క, బహు=విస్తారమయిన, విహృతులు=విహారములు, సారంగ...రుచులు — సారంగ=తుమ్మెదలయొక్కయు, కీర=చిలుకలయొక్కయు, అంగనా=స్త్రీలను, రంగ=విహారస్థలముగు నారంగ=నారింజచెట్లయొక్క, పరిపక్వ=పండిన, ఫల=పండ్లయొక్క, పరంపరల=పఙ్క్తులయొక్క, రుచులు=కాంతులును, వేలా...లలితములు వేలా=హద్దును, అపగ=దాటిపోయిన, ఆలాప=వాక్యములయొక్క, లీలా=విలాసము, పర=ప్రధానముగల, పిక=కోయిలలయొక్క, ఆవళీ=పంక్తి

యొక్క, లాలిత=సమ్మానించఁబడుచున్న, మహాత్=గొప్పలగు, కుహూ=కుహూధ్వనుల యొక్క, [కోయిలకూతకు కుహూధ్వని పేరు] లలితములు=విలాసములును, ఐంద...ష్యందములును. ఐందవశిలా=చంద్రకాంతి మణులయొక్క, కలాప=సమూహముయొక్క, నిష్యందములును=జలప్రవాహములును, సార...ధోరణులును, సార=శ్రేష్ఠమైన, మారంద=మకరందసంబంధియగు, సారణీ=పిల్లకాలువలయొక్క, ధోరణులును=పఙ్క్తులును, విలసిలు=ప్రకాశించునట్టి, ఒకానొకవిలాసవిపినమునకు=ఒకప్రమదారామమందు, తోడుచేడియలనుగూడి=చెలికత్తెలనుగూడి, ఆడఁదలఁచి=విహరించుటకాలోచించి-

క. నిగనిగలుగలిగిసొగసగు।
తొగరుచిగురుపాదుకలను-దొడిగిచెలుల్ తో।
డుగరామగరానిగరా।
లఁగరాళితమైనతోవ-లఁగనుంగొనుచున్॥

టీ॥ నిగనిగలుఁగలిగి=తళతళ్యములుఁగలిగి, సొగసగు=మనోహరమైన, తొగరుచిగురుఁ బాదుకలను=ఎఱ్ఱనిచిగుళ్ళ పావలను, తొడిగి=ధరించి, చెలుల్=చెలికత్తెలు, తోడుగరాన్=వెంటరాఁగా, మగరానిగరాలన్=శ్రేష్ఠములగు వజ్రములచేత. కరాళితమైన=పొదవైన, తోవలన్=మార్గములను, కనుంగొనుచున్=చూచుచు-

సీ. కప్పురాలొప్పరా-చప్పరాలనెసంగు,
కప్పుకాల్గప్పుమా-ర్గమునసైనఁ।
బలుకురాచిలుకరా-జులకురాగమొసంగు,
పలుకురాల్గులుకుమేల్-పద్యసైనఁ।
బొదలసంపదలస-మ్మదలసద్గతిమించి,
పొదలుతుమ్మెదలాను-పదవినైన।

